# అక్షర క్రాంతి

(సాహిత్య, సామాజిక, సాంస్కృతిక ద్వైమాసిక పత్రిక)

మొదటి సంచిక

సెప్టెంబర్–అక్టోబర్ 2018

తెలుగు శాఖ,
ఇందిరా ప్రియదర్శిని,
ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల,
నాంపల్లి హైదరాబాదు, తెలంగాణ

తెలుగు ! వెలుగు !!




గౌరవ సంపాదకులు

**ఆచార్య సూర్యా ధనంజయ్**

తెలుగు శాఖ, ఉస్మానియ విశ్వవిద్యాలయం.

**ఆచార్య దార్ల వెంకటేశ్వర రావు**

తెలుగు శాఖ, హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం.

ప్రధాన సంపాదకులు

**డా॥ జి. ఆదినారాయణ**

తెలుగు శాఖ

*సంపాదకులు*

**పి. ధనలక్ష్మి** (అధ్యాపకురాలు)

*సహ సంపాదకులు*

**పి. హిమబిందు** (బి.యస్సీ. ద్వితీయ)

**శ్రీహిత** (బి.ఏ. తృతీయ)

**యస్. సౌజన్య** (బి.కాం, మొదటి)

ప్రధానాచార్యులు

**డా॥ డి. వరలక్ష్మి**

ఇందిరా ప్రియదర్శిని ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల

నాంపల్లి, హైదరాబాద్, తెలంగాణ.

# విషయసూచిక



| కవితలు | | పుట |
|---|---|---|
| 1. ప్రతి సిరాచుక్క | – డా. జి. ఆదినారాయణ | 04 |
| 2. నా పల్లె | – ఎస్. సౌజన్య | 04 |
| 3. ఓ కలం కావాలి | – ఎన్. కవిత | 05 |
| 4. చింత చిగురులా వికసించిన రోజు | – డి. హేమ | 05 |
| 5. నా మాతృమూర్తి | – కె. నందిని | 06 |
| 6. బలహీనత అనిపించే బలం స్నేహం | – జి. శిరీష | 06 |
| 7. పేరడి కవిత్వం | – ఎస్. భువనేశ్వరీ | 07 |
| 8. వర్షం – మట్టి సువాసన పరిమళం | – డి. హరిత | 07 |
| 9. పిడికెడు హృదయంలో నీవు | – టి. ద్రాక్షవేణి | 08 |
| 10. బంగారు తాత | – పి. హిమబిందు | 08 |
| 11. నేస్తం | – పి. మనీష | 09 |
| 12. అమ్మా | – డి.హరిత | 09 |
| 13. లైఫ్ | – యం. కుసుమ | 09 |
| 14. తాంబాలమంత తంగెడుపువ్వు – బతుకమ్మ | – కె. నందిని | 10 |
| 15. పుడమి ఒడిలో పూసిన బతుకమ్మ | – ఎన్. కవిత | 11 |
| **వ్యాసాలు** | | |
| 16. గురువు గొప్పదనం | – ఆర్. అన్నపూర్ణ | 11 |
| 17. మాతృమూర్తి మదర్ థెరిస్సా | – ఆర్. లక్ష్మీ | 12 |
| 18. బతుకమ్మ పండుగ | – బి. స్వాతి | 13 |
| 19. బతుకునిచ్చే అమ్మ బతుకమ్మ | – పి. హిమబిందు | 15 |
| **కథలు** | | |
| 20. తెలివైన ఎద్దు | – శ్రీహిత | 16 |

**ప్రతులకు :** తెలుగు విభాగం, ఇందిరా ప్రియదర్శిని ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, నాంపల్లి, హైదరాబాద్.

# ముందుమాట

ఈ పత్రిక రావడానికి ప్రధాన కారణం మా విద్యార్థుల చురుకుదనం, ఉత్సాహం. నేను కళాశాలలో ప్రవేశించిన తర్వాత కొన్ని సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. అందులో మా విద్యార్థుల పాత్ర చాలా కీలకంగా కనబడింది. విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోధకులు చేయలేని పనులు వీళ్ళు డిగ్రీ స్థాయిలోనే చేస్తున్నారు అనిపించింది. అనేక కళల పై ఆసక్తి కనబరుస్తూ చాలా చురుగ్గా పాల్గొన్నారు. వీరు అనుకుంటే ఇష్టంతో ఏదైనా సాధించగలరు అని అనిపించింది. తెలుగు సాహిత్యంలో భాగంగా వీరిచే కవితలు, కథలు, వ్యాసాలు ఎందుకు రాయించకూడదు అనిపించింది. ఒకరోజు తరగతి గదిలో పాఠ్యానంతరం సృజనాత్మక సాహిత్యం గురించి మాట్లాడాను. ఎంతో ఆసక్తి కనబరిచారు. నేను రాసిన ఒక కవిత వినిపించాను. అది విని వారు ఎంతో ముచ్చట పడిపోయారు. వారి ముఖాల్లో ఏదో తెలియని ఆనందం కనిపించింది. మీరు ఎదైనా కవిత రాయగలరా అని అడిగాను. అందులో సగానికి పైగా సరే అన్నట్లు తల ఊపారు. ఒక తరగతిలోనే ఇంత ఉత్సాహం ఉంటే మొత్తం కాలేజిలో ఎంత మంది విద్యార్థులు ఇలా ఆసక్తిగా ఉంటారు అని మరో తరగతి గదిలో కూడా ఆ కవిత వినిపించా వారు మరీ ఆనందపడిపోయి మేం కూడా రాస్తాం సార్ అని అన్నారు.

ఆ తర్వాత మరుసటి రోజు నేను తరగతికి వెళితే సార్ ఒకసారి మీ కవిత మళ్ళీ చదవరా అని అన్నారు. మళ్ళీ చదవమని అంటున్నారంటే వారికి కూడా రాయాలనే తపన మొదలైంది అని అనుకున్నా అందుకు మళ్ళీ ఒకసారి చదివాను. చాలా ఉత్సాహంతో బరువెక్కిన తరగతి గది తొర్లుతున్న నిండుకుండాలా అనిపించింది. ఒక రెండు రోజుల్లో రాయగలరా అన్నాను రాస్తాం సార్ అని ముక్తకంఠంతో చెప్పారు. కొంత మంది ఏ అంశం పై రాయాలని అడగగా సమాజంలో ప్రతీది కవిత్వానికి, కథకు వస్తువు అవుతుంది అని సృజనాత్మక రచన గురించి కొన్ని మెలుకువలు, రచనా వస్తువుల గురించి క్లుప్తంగా వివరించాను. రెండు రోజుల్లో ఐదు కవితలు రాసి ఇచ్చారు. ఆ తర్వాత రోజుకు ఒక నాలుగు కవితలు ఇచ్చారు. అవి చదివాక చాలా అద్భుతంగా రాశారు అనిపించింది. దీంతో కచ్చితంగా ఇక నుండి వారి రచనలతో పత్రికను నడపవచ్చు అనిపించి, నిత్యం వారి తలలను చరవాణిలో బందిచే కన్నా వారికి పెన్ను పేపర్ ను కొంత సేపు పట్టించి వారి సృజనాత్మక శక్తిని, తీరిక సమయాన్ని ఇందుకోసం కేటాయించవచ్చు అనిపించింది ఆ చిరు ప్రయత్నమే ఈ పత్రిక.

ఇట్లు

ప్రధాన సంపాదకులు

# సృజనాత్మక రచనలకు వెలుగు బాట 'అక్షర క్రాంతి'

డా॥ డి. వరలక్ష్మి
ప్రధానాచార్యులు
ఇందిరా ప్రియదర్శిని ప్రభుత్వ
మహిళా డిగ్రీ కళాశాల నాంపల్లి,
హైదరాబాద్. తెలంగాణ. 500001

అక్షర క్రాంతి మాస పత్రిక ప్రారంభించాలన్న ఆలోచన చిగురించిన మొదలు మొదటి సంచికని విడుదల చేస్తున్న మా తెలుగు విభాగమునకు మరియు ఆదినారాయణ గారికి నా ప్రత్యేకమైన అభినందనలు. విద్యార్థులలో ఉత్తేజాన్ని నింపి ఆలోచనా సరళిని ప్రోత్సహించేందుకు వేసిన ఈ తొలి అడుగు ముందు ముందు వీరు రచయిత్రులుగా, కవయిత్రులుగా, సంపాదకులుగా ఎదుగుటకు మార్గదర్శకం అవ్వాలని ఆకాంక్షిస్తున్నాను.

ఆత్మీయ బంధాలని, సామాజిక, ప్రాకృతిక అంశాలపై వ్రాసిన కవితలు కథలు ఆహ్లాదకరముగా, మనోరంజకముగా, సామాజిక స్పృహ పెంపొందించేలా ఉన్నాయి. నిజాయితీగా సహజ భావ ప్రకటన వ్యక్త పరచాలన్న ఆసక్తి గల వారికి ఈ పత్రిక ఒక మాధ్యమం అవుతుంది. ఏ లక్ష్య సాధనకై ఈ పత్రికని ప్రారంభించారో ఆ గమ్యం సఫలీకృతం కావాలని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను...

మీ ప్రధానాచార్యులు
డా॥ డి. వరలక్ష్మి

## ప్రతి సిరా చుక్క

తెల్లని మొదళ్లపై రాసే
ప్రతి సిరా చుక్క
నీ ప్రగతికి
పరిమళం ఇవ్వాలి
సమాజానికి
సందేశం ఇవ్వాలి
ఆ మెదళ్ళపై రాసే
ప్రతి సిరా చుక్క
అప్పుడే పుట్టిన
శిశువు వలె
నూతనోత్తేజాన్ని
కలిగించాలి
ప్రతి సిరా చుక్క
మట్టి పగుల్ల నుండి
బయటికొస్తున్న
మొక్కలా విచ్చుకొని
మహావృక్షంలా
మారిపోవాలి

*(ప్రధాన సంపాదక కవిత)*



## నా పల్లె

*ఎస్. సౌజన్య*
*బి.కామ్.(జనరల్) మొదటి సంవత్సరం*

వేకువనే నిద్రలేపే కోడి కూతలు
పేడతో ఆకుపచ్చని అలుకు(సాన్పి)
సింగిడి లెక్క పరుచుకున్న ముగ్గులు
పళ్ళుతోముకునే వేపపుల్లలు
ఏమైపాయే .... నేడు ఏమైపాయే...
అరుగుమీద కూర్చోని
ఆప్యాయత పలకరింపులు
ఉదయాన్నే తినే సద్దిబువ్వలు, జొన్నరొట్టెలు
అవ్వా అని పిలిచిన ఆత్మీయత
అయ్యా అని చూపిన అనురాగం
ఏమైపాయే .... నేడు ఏమైపాయే...
బతుకమ్మ పండుగ ముచ్చట్లు
దసరా పండుగ దరువులు
పీర్ల జాతర సవ్వడులు
మిత్రుల బొంగరపు సంబురాలు
ఏమైపాయే .... నేడు ఏమైపాయే...
ప్రపంచీకరణ ప్రభావంతో
నా పల్లె పట్నంకు వలసబాయే
సదువుకొన్న నా కొడుకు
ఒకని కింద జీతగాడయే
పాలిపోయిన నా పల్లెలో
పలకరింపే కరువాయే

## ఓ కలం కావాలి



ఎస్. కవిత. బియస్సీ
(యం. ఎస్. సి, ఎస్)
ద్వితీయ సంవత్సరం

పసిపిల్లలకు కన్నతల్లి ఒడి
ఎంత ఊరటనిస్తుందో,
పంటనిచ్చే పొలానికి
ఎంత నేర్పు ఉంటుందో,
వర్షించే మేఘానికి
సంద్రం ఎంత విశాలంగా కనబడుతుందో,
గుడిలో భగవంతునికి
పూజించే పూజారి ఎంత
విధేయంగా ఉంటాడో,
విజ్ఞానాన్ని అందించే గురువు
ఎంత సహనంగా విద్య నేర్పుతాడో
నేడు....
అజ్ఞానంతో నడుస్తున్న
అందకారపు ఈ సమాజాన్ని
మేల్కొల్పడానికి, తేజోకాంతులను
వెదజల్లడానికి.....
కలం కావాలి .. ఓ కలం కావాలి..

## చింత చిగురులా వికసించిన

*డి. హేమ*
*బి.ఎస్సీ, ఎం.బై.సి.*
*ద్వితీయ సంవత్సరం*

నవ ఉదయం కనిపించిన రోజు
ఎందరో వీరుల వీరమరణాల
త్యాగ ఫలితం లభించిన రోజు
వసంత రుతువులో చిగురించిన
చింత చిగురు వలె చిగురించిన రోజు
తల్లి ఒడిలోకి నవ్వుతూ ఉన్న
ఓ..పసిగుడ్డు చేరిన రోజు
సూర్య కిరణాలు కలువల పై పడితే
ఎంత తేజోవంతంగా వికసిస్తాయో
ఇక్కడి ప్రజల హృదయాలు కూడా
అంతే తేజోవంతంగా
విచ్చుకుంటున్న రోజు
అదే జూన్ 2 .......
తెలంగాణ ఆవిర్భావ రోజు

## మాతృమూర్తి



కె. నందిని. బి.ఎస్సీ,
(యం.ఎస్.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

అమ్మ అనే మాట
రెండు పెదవులు పలికే
తేనెకన్న తియ్యని పదం...
రెండక్షరాల మధురమైన
మాట అమ్మా...
నీలోని ప్రతి అణువు
ఒక పసిపాపగా మార్చావు
నవ మాసాలు మోసి
నీ ప్రాణంతో నాకు ఊపిరి పోశావు
ఇంతటి సముద్రం కన్న లోతైన నీ ప్రేమ
హిమాలయాల కన్నా నీ చల్లని మనస్సు
ప్రేమకు ప్రతిరూపమైన నీ కళ్ళు
అమృతాన్ని పంచే నీ లాలి పాటలు
ఏమని రాయమంటావమ్మ
సప్తసముద్రాలంత సిరా
భూమి అంత కాగితం
ఒక మూలకు సరిపోదు
నీ గురించి రాయాలంటే...

## బలహీనత అనిపించే బలం



జి.శిరీష, బి.యస్సీ,
(యం.పి.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

మానవ హృదయాలను
వేరు చేయలేని బంధం
గెలుపు వదిలేసినా
ఓటమి హత్తుకున్నా, ప్రపంచం వెలేసినా
వెన్నుతట్టి భుజం కదిపి
దారి చూపిస్తూ ముందుకు నడిపే బంధం
స్నేహం...
ఏడిపిస్తూ ఓదార్చే చెలిమి స్నేహం
బలహీనత అనిపించే బలం స్నేహం
పెడితే నిలబెట్టే నమ్మకం స్నేహం

★★★★★★★

గులాబి మొక్కకి నీరు కావాలి
మనుష్యులకు గాలి కావాలి
విద్యార్థికి టీచర్ కావాలి
నాకు నీ స్నేహం కావాలి

★★★★★★★

రంగులేని పువ్వుకి ఆకర్షణ లేదు
అలలు లేని సముద్రానికి అందం లేదు
సూర్యుడు లేని ప్రపంచానికి వెలుగు లేదు
నీ స్నేహం లేని జీవితానికి అర్థం లేదు.

## పేరడి కవిత్వం



S. భువనేశ్వరి.
బియస్సీ,
(యం.పి.సి.యస్.)
ద్వితీయ సంవత్సరం

రైతు పండించే పంట
అమ్మ చేసే వంట
తినకపోతే
కడుపులో మంట
అది చెప్పుకోలేక కొట్టాను గంట

★★★★★★

నాకు ఓ అందాల చెల్లి
అది చేస్తుంది రోజు లొల్లి
తట్టుకోలేక ఏడ్చాను ఆమెను గిల్లీ
అందుకు అది పరుగులు తీసింది గల్లీ గల్లీ
నవ్వింది మా అక్క మళ్ళీ మళ్ళీ

★★★★★★★

మా ఇంట్లో వున్నాడు పని మనిషి అంజి
వాడు తాగుతాడు రోజు గంజి
లేదని ఎంత చెప్పినా వినడు ముంజి
అది నచ్చక లాగి కొట్టింది
మా అమ్మ గుంజి గుంజి

## వర్షం – మట్టి సువాసన

*డి. హరిత*
*బి.కామ్. కంప్యూటర్స్*
*మొదటి సంవత్సరం*

వర్షం చిరుజల్లుల్ని .. జారవిడుస్తూ
పిల్లల్ని ఆటల్లో ఆనందపరుస్తుంది
పెద్దల్ని మట్టి సువాసనతో
మైమరిపిస్తుంది.
రైతన్నల..
పంట పొలాల చెరువుల్ని
తొలకరిస్తున్న కుండలా నింపుతుంది
చకోరక పక్షిలాగా ఆశ్వాదిస్తున్న ప్రకృతి
తన అందాలను వెదజల్లుతూ
మానవ డెందాలను పరవశింపజేస్తుంది.
కోకిల రాగాలతో
మామిడి చిగురు సైతం
నిక్కి నిక్కి చూస్తున్నాయి...
ఆ చినుకు మత్తడికి
చేప పిల్లలు సైతం
ఈతకు సై అంటున్నాయి..

## పిడికెడు హృదయంలో నీవు

*టి. ద్రాక్షవేణి*
*బి.కామ్. కంప్యూటర్స్*
*మొదటి సంవత్సరం*

అమ్మ మనకు అన్నం పెడుతుంది
నాన్న మనల్ని లాలిస్తాడు
గురువు మనకు నమ్మకాన్నిస్తాడు
మిత్రుడు ఆపదలో ఆదుకుంటాడు

మిత్రమా
నింగికి నిచ్చెన వేసి రాసా నీపేరు
నక్షత్రాలు వచ్చి చెరిపేసాయి
సముద్రపు నేల మీద రాసా
అలలు వచ్చి చెరిపేసాయి
ఇక లాభం లేదనుకున్నా
ఇప్పుడు
పిడికెడు హృదయంలో రాస్తున్నా
అది ఎవరు చెరుప లేరు మిత్రమా
ఆ చోటు నీకే దక్కింది
చాటంత హృదయంలో
చల్లని హాయినివ్వు
చిరునవ్వుని వెదజల్లు..

## బంగారు తాత



పి. హిమబిందు. బియస్సీ,
(యం.ఎస్.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

మాతాతగారు బహుమంచి వారు
ప్రేమానురాగాలు తామైన వారు
అమ్మలా అందరిని ఆదరిస్తాడు
ఆటాపాటలతో మమ్ము అలరిస్తారు
ఆనందమంటే చూపిస్తారు
పసినవ్వుతో పలకరిస్తారు
పరుచుకున్న విస్తరిలా
హత్తుకుంటారు.
తాతగారి జన్మదినం
మాకెంతె పర్వదినం
మాతాతగారంటే మాకెంతో ఇష్టం
బంగారు తాతయ్య వెయ్యేళ్ళు వర్ధిల్లి
మా ముందు నిలవాలి
జేజేలు మా తాతకు
జేజేలు జేజేలు

## నేస్తం



పి. మనీష, బియస్సీ,
(యం.ఎస్.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

నేస్తమా ఓ నేస్తమా
బడి అనే గుడిలో ఆప్యాయత పంచి
నిస్వార్థంగా తోడున్నావు
నీడనిచ్చే చెట్టులా నిలిచి
నిండు జాబిలివై వెలిగావు
నిస్వార్థపు నీ స్నేహం
కలకాలం నిలవాలి
మన స్నేహం గెలవాలి...

## అమ్మా

*డి.హరిత*
*బి.కమ్. కంప్యూటర్స్*
*మొదటి సంవత్సరం*

అమ్మా... గొప్ప వరం
నీ ప్రేమను తెలిపే సంగీత స్వరాన్ని
నీ చేతి ముద్ద మరువలేని ఓ జ్ఞాపకం
సమాజాన్ని నడిపిస్తున్న
వంట గదివి నీవు...
ప్రతి మనిషికి మొదటి గురువు నీవు...

## LIFE



యం. కుసుమ, బియస్సీ
(యం.పి.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

Life is an opportunity,
But from it
Life is a beauty, admire it
Life is a dream, realize it
Life is a challenge, face it
Life is a duty, complete it
Life is a game, play it
Life is a promise fulfil it
Life is a sorrow, overcome it
Life is a song, sing it
Life is a struggle, accept it
Life is an adventure, dare it
Life is a luck, make it
Life is too precious,
Don’t destroy it
Life is life, fight for it

## తాంబాలమంత తంగేడు పువ్వు - బతుకమ్మ



కె. నందిని. బి.ఎస్సీ,
(యం.ఎస్.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

ప్రకృతితో మురిసిపోయే
పాలపిట్టల ఎగురులాటలు
కృష్ణజింకల పరుగులు
కాకతీయ కళాతోరణ స్వాగత పలుకులు
ఎవరికోసమో కాదు
మనకు బ్రతుకునిచ్చే బతుకమ్మ కోసం.
తెలంగాణలోని ప్రతి పల్లె ఎదురుచూపులు
ఏడాదికోసారి ఎక్కడెక్కడి నుండో వచ్చి
ఆప్యాయంగా పలుకరించుకునే
ఆడపడుచులు
తీరొక్క పూలతో తీపి గుర్తులను
పసుపు ముద్దతో వెలిగె గౌరమ్మ కోసం
అక్కాచెల్లెల్లు ఎదరుచూసే పండుగ
ఈ నవరాత్రుల పండుగ
మన బతుకమ్మ పండుగ
పేదవాడి ఆనందహేళి మన బతుకమ్మ
కొత్త బట్టల మురిపెం మన బతుకమ్మ
ఆప్యాయత పలకరింపులు
మన బతుకమ్మ
జానపదుని జనజీవని మన బతుకమ్మ
తాంబలమంతా తంగేడు పువ్వుతో
బంతి, చేమంతు కలయికతో
గునగ, బీర, గుమ్మడి పూలతో
గుభాలింపుతో
తీరొక్క పూల గోపురమమ్మ బతుకమ్మ
ఎంగిలిపూల బతుకమ్మగా
మన ఇంట కాలుమోపి
అటుకుల బతుకమ్మగా ఆడుతూ పాడుతూ
ముద్దపప్పు బతుకమ్మగా మురిపిస్తూ
నానబియ్యం బతుకమ్మగా నిండుదనాన్నిస్తూ
అట్ల బతుకమ్మగా ఆదరిస్తూ
అలిగిన బతుకమ్మగా అనుదినం నవ్వుతూ
వేపకాయ బతుకమ్మగా
వెన్నంటే ఉంటూ
సద్దుల బతుకమ్మగా చిందులేస్తూ
బంగారు జమ్మి చెట్టును పలుకరిస్తూ
వెళ్ళివస్తాను మళ్ళీ ఏడాదికి వస్తాను అంటూ
బతుకునిచ్చే మా బతుకమ్మ
కలకాలం బ్రతకాలి
మా బతుకులు బాగుండాలి



## పుడమి ఒడిలో పూసిన బతుకమ్మ



ఎన్. కవిత . బి.ఎస్సీ,
(యం.ఎస్.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

పుడమి ఒడిలో పూసిన ఓ పువ్వా
పుత్తడి బొమ్మ మా బంగరు బతుకమ్మా
నిన్ను కొలుచిరి రంగురంగుల శిఖరాలుగా
మదిలో తలుచుకొనిరి ఆనంద రాశులుగా
రంగు పువ్వుల కలిమి చూసి
తల వంచెను గగన హరివిల్లు
నీ తేజో కాంతికి
వెల వెల బోయిరి ఆకాశ తారలు
అమ్మలక్కలు పాడిరి నీగానం ఆనంద హరితో
పసిపిల్లల అల్లరి కేరింతలు
మగువల కొట్లాట సవ్వడులతో
ఊరేగే మా పల్లె ఉత్సాహంతో
గంగమ్మ, గౌరమ్మ నీ తోబుట్టువులు
సాగిపోమన్నారు మా ఇంటి మహామణులు
సడిపొద్దు ధరణి చేరు వేళలో
విలీనం అయినావు గంగా తరంగిణిలో
బతుకమ్మ ఓ సద్దుల బతుకమ్మా..

## గురువు గొప్ప తనం

*ఆర్. అన్నపూర్ణ*
*బి.కామ్. కంప్యూటర్*
*మొదటి సంవత్సరం*

గురువు మన చీకటి జీవితానికి వెలుగు చూపే చంద్రబింబం, మనకు ఎలా అవసర మవుతారో అని కాదు గురువు నుండి ఏం నేర్చుకోవాలో తెలియాలి. గురువు అనే పదానికి అర్థం చూసినట్లయితే మనం మొదటగా మన తల్లి గర్భం నుండి బయటికి రావాలి అంటే దానికి ప్రత్యక్షంగా వైద్యుడు అనే గురువు మనల్ని తల్లి గర్భం నుండి బయటకు తీసి ప్రపంచానికి పరిచయం చేస్తాడు. వైద్యుడనే గురువు లేకపోతే ప్రపంచం చిన్నాభిన్నం అవుతుంది. మనం తల్లిగర్భం నుండి బయటికి వచ్చి నప్పటి నుండి చివరకు చనిపోయే వరకు మనకు ఎవరో ఒకరు గురువు రూపంలో బోధన చేస్తూనే ఉంటారు. అలా చేసేవారినే అసలైన గురువుగా భావించాలి. అలాగే మనకు గురువు లాంటి స్థానం పొందిన మొదటివారు మన తల్లిదండ్రు లు. ఎందుకంటే మనం వారి నుండే ప్రతిది అనుకరణ రూపంలో తల్లిదండ్రులు చేసి ప్రతి పనిని మనం చేస్తాము. కాబట్టి ప్రతి మనిషి జీవితంలో మొట్టమొదటి గురువులు మన తల్లిదండ్రులు. మన తల్లిదండ్రులు మొదట

మనకు మంచి మార్గాన్ని చూపిస్తారు. మంచి ప్రవర్తనను నేర్పిస్తారు. ఎప్పుడు మన గురించి ఆలోచిస్తారు. మన ఆనందాన్ని ఆశిస్తారు తర్వాత గురువు తన జ్ఞానాన్ని విద్యార్థి జీవితాలకు దార పోస్తాడు. వారి ద్వారనే మనం గొప్ప స్థానంలో నిలుస్తాము. ఈ ప్రపంచంలో తన అపారమైన జ్ఞానాన్ని దారపోస్తున్న ఏకైక వ్యక్తి గురువు. అందుకే మనం గురువుకు ఎంతమందిలో ఉన్నా నమస్కారం చేస్తాం. మనం ఏస్థాయిలో ఉన్నా తన గురువు అని వందల, వేల మందిలో ధైర్యంగా చెప్పుకుంటాము. కొన్ని సందర్భాల్లో తల్లిదండ్రుల కంటే గురువులకే విలువ ఇస్తాం. తల్లిదండ్రుల తర్వాత స్థానం కేవలం గురువు లకే దక్కుతుంది. గురువు లేని సమాజం శూన్యం. గురువు లేని విద్య అందకార విద్య. మన నడవడికి గురువు ప్రత్యక్షంగానో పరోక్షంగా ప్రేరణను ఇస్తాడు. అందుకే మనం గురువును గురుర్ బ్రహ్మ, గురుర్ విష్ణు, గురుర్ దేవో మహేశ్వర అని త్రిమూర్తులతో పోల్చాము. అందుకే మనకు ఈ ప్రపంచంలో గురువు తర్వాతనే ఎవరైనా అనే విషయం గుర్తుంచుకోవాలి.

# మాతృమూర్తి మదర్ థెరిస్సా



ఆర్. లక్ష్మి
బి.కామ్. కంప్యుటర్స్
మొదటి సంవత్సరం

మానవతా హృదయానికి మారు పేరు మధర్ థెరిస్సా. ఆగ్నిస్ గోక్షా బోజాక్షు అనే పేరుతో అల్బేనియా దేశానికి చెందిన రోమన్ క్యాథలిక్ సన్యాసి. ఈమె ఆగష్టు 26, 1910 లో జన్మించారు. ప్రపంచ వ్యాప్తంగా ఈమె పేరు తెలియనివారంటూ ఉండరని చెప్పవచ్చు. భారతదేశ పౌరసత్వం పొంది "మిషనరీ ఆఫ్ చారిటీని" భారతదేశంలో కలకత్తా లో 1950 లో స్థాపించారు. దాదాపుగా 45 సంవత్సరాల పాటు మిషనరీ చారిటిని భారతదేశంలో మరియు ప్రపంచంలోని ఇతర దేశాలలో వ్యాపించేలా మార్గ దర్శకత్వం వహిస్తూ పేదలకు, అనాధలకు ఎంతో సేవ చేసింది.

థెరిస్సా మిషనరీ ఆఫ్ చారిటి తో దాదాపుగా 123 దేశాలలో 610 సంఘాలను కలిగి హెచ్.ఐ.వి, కుష్టు, మరియు క్షయ వ్యాధి గ్రస్తులకు ధర్మశాలను, గృహాలను, ఆహార కేంద్రాలను, బాలల మరియు కుంటు సలహా కార్యక్రమాలను అనాథ శరణాలయాలను, పాఠశాలలను స్థాపించారు. ఇందుకుగాను

మాల్కం ముగేరిడ్జ్ చే రచింపబడిన "సమ్ థింగ్ బ్యూటిఫుల్ ఫర్ గాడ్" అనే పుస్తకం మరియు డాక్యుమెంటరీ ద్వారా 1970 ల నాటి మానవతావాది మరియు నిస్సహాయకుల అనుకూలురాలిగా అంతర్జాతీయ స్థాయి కీర్తిని పొందింది. తన మానవతా సేవ దృక్పథానికి గాను భారత అత్యున్నత పురస్కారం అయిన నోబెల్ శాంతి పురస్కారం, భారత రత్న వంటి పురస్కారాలు పొందారు.

అనేక మంది వ్యక్తులు, ప్రభుత్వాలు మరియు సంస్థలచే ప్రశంసింపబడినప్పటికి అనేక రకాల విమర్శలు కూడా ఎదుర్కొన్నారు. ఆమె తన కార్యక్రమాలలో భాగంగా మత మార్పిడీలను ప్రోత్సహించడం, గర్భస్రావం పట్ల తీవ్ర నిరోధకత, పేదరికం పట్ల మత పరమైన నమ్మకాలను కలిగి ఉండడం వల్ల అనేక సంస్థల నుండి తీవ్ర విమర్శలు ఎదుర్కొన్నప్పటికీ తాను ఎంచుకున్న మార్గానికి మాత్రం ఎక్కడ వెనకడుగు వేయలేదు. "*నేను కాన్వేటును వదిలి పేదల మధ్య నివసిస్తూ వారికి సేవ చేయాలి ఇది నా ఆజ్ఞ*" అని దీనిని నేను పాటించకపోతే విశ్వాసాన్ని కోల్పోయిన ట్లే అని ప్రకటించింది. ఇంతటి త్యాగశీలి ఈ లోకం నుండి సెప్టెంబర్ 5, 1997 న పరమ పదించారు.

# బతుకమ్మ పండుగ

*బి. స్వాతి*
*బి.కాం. కంప్యూటర్స్*
*మొదటి సంవత్సరం*

*ఒక్కొక్క పువ్వేసి చందమామ*
*ఒక్కజాము లాయె చందమామ*
*రెండేసి పులేసి చందమామ*
*రెండు జాము లాయే చందమామ*

అంటూ పాడుకునే పాట బతుకమ్మ పాట. సెప్టెంబర్, అక్టోబర్ మాసంలో తెలంగాణ ప్రజలకు పండుగల నెలలు. ఈ మాసాలలో రెండు పెద్ద పండుగలు జరుప బడుతాయి అవే బతుకమ్మ, విజయ దశమి (దసర). ఈ పండుగలకు కనీసం పదిహేను రోజులు అయివైపు, ఇటు వైపు అంతా సంబరాలు, కుటంబ కోలాహలాలు, కలయిక లతో నిండి పోయి ఉంటుంది. ఈ పండుగల లో ఒకటి బతుకమ్మ పండుగ మరి ఒకటి దసర (విజయ దశమి) అయితే బతుకమ్మ పండుగ మాత్రం తెలంగాణకు మాత్రమే ప్రత్యేక మయిన పండుగ. తెలంగాణ సాంస్కృతిక పండుగగా చెప్పవచ్చును.

బతుకమ్మ పండుగను తొమ్మిది రోజుల పాటు జరుపుతారు. ముఖ్యంగా తెలంగాణ ఆడ పడుచులు అందరు కూడా ఆనందదాయకం గా జరుపుకునే పండుగ. ఈ తొమ్మిది రోజుల పాటు ప్రతిరోజు కూడా ఒక

రకమైన నైవేద్యాన్ని సమర్పిస్తారు. మొదటి ఎనిమిది రోజులు ఈ నైవేద్యం తయారీలో యువకులు, యువతులు పాల్గొంటారు. చివరి రోజు సద్దుల బతుకమ్మ అంటారు. ఈ రోజు మాత్ర నైవేద్యాన్ని మహిళలు తయారు చేస్తారు. ఈ తొమ్మిది రోజుల ప్రాధాన్యతను గమనిద్దాం.

*1. ఎంగిలి పూల బతుకమ్మ :* మహా అమావాస్య రోజు బతుకమ్మ మొదటి వేడుక మొదలవుతుంది. తెలంగాణలో దీన్ని (పితృ అమవాస్య) పెత్రమాస అని అంటారు. నువ్వులు, బియ్యం పిండి, నూకలు కలిపి నైవేథ్యాన్ని తయారు చేస్తారు.

*2. అటుకుల బతుకమ్మ :* ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నాడు చేస్తారు. అటుకులు సప్పిడి పప్పు, బెల్లంతో నైవేథ్యాన్ని తయారు చేస్తారు.

*3. ముద్దపప్పు బతుకమ్మ :* ముద్దపప్పు, పాలు, బెల్లంతో నైవేథ్యాన్ని తయారు చేసి సమర్పిస్తారు.

*4. నాన బియ్య బతుకమ్మ :* నానపోసిన బియ్యంతో పాలు, బెల్లం తో నైవేథ్యాన్ని తయారు చేసి సమర్పిస్తారు.

5. అట్ల బతుకమ్మ : అట్లు పోసి నైవేథ్యాన్నిగా సమర్పిస్తారు.

6. అలిగిన బతుకమ్మ : ఈ రోజున ఆశ్వయుజ పంచమిఅందుకు ఏ నైవేథ్యాన్ని సమర్పించరు. ఈ రోజు బతుకమ్మ అలుగుతుంది అందుకే అలిగిన బతుకమ్మ అంటాం.

7. వేపకాయల బతుకమ్మ : బియ్యం పిండిని బాగా వేయించి వేప పండ్లుగా తయారు చేసి నైవేథ్యాన్నిగా సమర్పిస్తారు.

8. వెన్న ముద్దల బతుకమ్మ : నువ్వులు, వెన్న లేదా నెయ్యి బెల్లం కలిపి నైవేథ్యాన్ని తయారు చేస్తారు.

9. సద్దుల బతుకమ్మ : ఆశ్వయుజ అష్టమి నాడు దుర్గాష్టమిని జరుపుకుంటారు. ఐదు రకాల నైవేథ్యాలు తయారు చేస్తారు. పెరుగు అన్నం, చింతపండు పులిహోర, నిమ్మకాయ పులిహోర, కొబ్బరన్నం, నువ్వుల అన్నం

ఈ తొమ్మిది రోజులు సమర్పించే నైవేథ్యాలలో మొక్కజొన్నలు, జొన్నలు, సజ్జలు, మినుములు, శనగలు, పెసల్లు, పల్లీలు, నువ్వులు, గోధుమలు, బియ్యం, కాజు, బెల్లం, పాలు వంటివి ఉపయోగించి నైవేథ్యాన్నిగా తయారు చేస్తారు. ఇలా ఆప్యాయతతో బతుకమ్మను పూజిస్తూ, సందర్భాను సారంగా రకరకాల పాటలు పాడుతూ ఉంటారు.



# బ్రతుకునిచ్చే అమ్మ బతుకమ్మ



పి. హిమబిందు. బియస్సీ,
(యం.ఎస్.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

*చిత్తూ చిత్తుల బొమ్మ శివుని ముద్దులగుమ్మ*
*బంగారు బొమ్మ దొరికె నమ్మో ఈ వాడలోన*
*చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దులగుమ్మ*

అని చాలా ఆప్యాయంగా పాడుకుంట బతుకమ్మను కొలుస్తారు. ప్రతి దేవుకిడి కూడా పూవులతో పూజిస్తాం. కాని ఆ పువ్వులనే పూజించే సంస్కృతి తెలంగాణ ఆడపడుచుల కు ఉంది ఆ గొప్పదనమే మన బతుకమ్మ పండుగ. బతుకమ్మ పండుగ మన తెలంగాణ రాష్ట్ర పండుగ. బతుకమ్మ పండుగ తెలుగు రాష్ట్రాలలో ఆశ్వయుజ మాస శుద్ధ పాడ్యమి నుండి తొమ్మిది రోజుల పాటు జరుపు కుంటారు. ఈ బతుకమ్మను గౌరి పండుగ లేదా సద్దుల పండుగ అని కూడా అంటారు.

రంగు రంగుల పూలతో త్రికోణాకారం లో పేర్చి అలంకరించిన బతుకమ్మ చుట్టూ ఆడపడుచులు చప్పట్లు చరుస్తూ వలయంగా తిరుగుతూ బతుకమ్మ పాటలు పాడుతారు. బొడ్డెమ్మతో మొదలు ఎంగిలిపువ్వు బతుకమ్మ, సద్దుల బతుకమ్మ ఇలా దేని ప్రతేకత దానిదే. తొమ్మిది రోజల పాటు కొనసాగే బతుకమ్మల ను బావిలో లేదా నీటి ప్రవాహం లో నిమజ్జనం చేస్తారు.

*రామ రామ రామ ఉయ్యాలో*
*రామనే శ్రీ రామ ఉయ్యాలో*

అని సాగే ఈ పాటల్లో మహిళలు తమ కష్టసుఖాలు, ప్రేమ, స్నేహం, బందుత్వం, ఆప్యాయతలు, భక్తి, భయం, చరిత్ర, పురాణా లను అన్నింటిని మేళవిస్తారు. ఈ పాటలు చాలా వినసొంపుగా ఇతరులను ఆకర్షించే విధంగా ఉంటాయి.

*శుక్రవారం లక్ష్మీ ఉయ్యాలో*
*మా ఇంటికొస్తేను ఉయ్యాలో*

అని తెంగాణ సంస్కృతి, సాంప్రదాయాలకు తెలియ జేస్తారు. తెలంగాణ అస్తిత్వం మన బతుకమ్మలో కనబడుతుంది. తెలంగాణ నేలపై బతుకమ్మ పండుగను ఎన్నో శతాబ్దాలు గా ఆడపడుచులు జరుపుకుంటారు. ఈ పండుగ వర్షాకాలపు చివరిలో, శీతాకాలపు తొలి రోజులలో వస్తుంది. అప్పటికే వర్షాలతో చెరువులన్నీ మంచి నీటితో నిండి ఉంటాయి. రకరకాల పువ్వులు రంగు రంగులతో ఆరు బయట పూసి ఉంటాయి. వీటిలో గునుగు పూలు, తంగేడు పూలు బాగా ఎక్కువగా

పూస్తాయి. బంతి, చేమంతి, నంది వర్ధనం పూలకు కూడా ఇదే సమయం.

*చినుకు చినుకు వాన ఉయ్యాలో*
*చిత్తడి వాన ఉయ్యాలో*
*పోదాము చిత్తారి ఉయ్యాలో*
*మూడు బాటల కాడికి ఉయ్యాలో*
*బాలల బతుకమ్మ ఉయ్యాలో*

అని ఎంతో సౌందర్యవంతంగా గ్రామంలో జరిగే ప్రతి విషయాన్ని గుర్తుకు చేసుకుంటూ ఈ పాటలు పాడుకుంటారు.

తెలంగాణ ఉద్యమంలో బతుకమ్మ పాత్ర ఎంతో విశిష్టమైంది. తెలంగాణ ఉద్యమ సందర్భాల్లో ఊరేగింపులు చేసిన తెలంగాణ ప్రజలు తమ తమ అస్తిత్వాన్ని సగర్వంగా ప్రకటించుకున్నారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడ్డ తరుణంలో బతుకమ్మ పండుగకు ప్రాధాన్యత మరింత పెరిగిపోయింది.

**మీ సంతకం ఆటోగ్రాఫ్ గా మారడమే సక్సెస్**

*– అబ్దుల్ కలాం*

## తెలివైన ఎద్దు



సి.హెచ్. శ్రీహిత, బి.ఏ
తృతీయ సంవత్సరం

నా పేరు ఎద్దు. నేను మొద్దుగా కష్టం చేస్తాను. నా యుక్త వయస్సులో నన్ను చూసి ఈర్ష పడేవారు అందరు నా యజమానితో సహా. అప్పుడు ఇంటి కొట్టంలో నాకు ఒక చోటు ఇచ్చి పౌష్టికరమైన ఆహారం అందించే వాడు నా యజమాని. వయస్సు మళ్ళిన కొద్ది నేను బలహీనపడ్డానని నన్ను ఇంటి నుండి వెళ్లగొట్టాడు. ఏమాత్రం దయలేని స్వార్థ బుద్దిజీవి నా యజమాని. భగవంతుడు దయా హృదయుడు ఏదో ఒక విధంగా సాయం చేయకపోతాడా అంటూ, నడుచుకుంటూ అడవి వైపు వెళుతుంది.

ఈలోగా ఎద్దుకు ఆ అడవిలో ఒక సింహం కనబడింది. అది ఇక్కడికే వస్తున్నట్టుంది. మరి నేను వెంటనే జాగ్రత్త పడాలి. ఇప్పుడు నా తెలివిని ఉపయోగించాలి లేదంటే నేను ఈ రోజు సింహానికి ఆహారంగా అయి పోతాను. సింహం ఆ సమయంలో అటుగా వస్తున్న ఎద్దును చూసి ఆహా! ఎంత బలిష్టమైన ఎద్దు. ఈ వేళ మంచి ఆహారం దొరకబోతుంది నాకు అని సింహం తన మనస్సులో అనుకుంటుంది. అది గమనించిన ఎద్దు

తనను రక్షించుకోడానికి కొంత గంభీరంతో సింహాన్ని బెదరించడానికి ఇలా అంటుంది.

వింటున్నావా తయారుగా ఉండు... ఈ రోజు నీకు మన పిల్లలకు మంచి ఆహారం లభించబోతుంది. ఓ సింహం ఈ దారి గుండా వస్తుంది. ఆగు ఆగు నిశబ్ధంగా ఉండు లేదంటే సింహం పారిపోవచ్చు అని ఎద్దు అంటుంది. నేను వింటున్నది నిజమేనా ఈ ఎద్దు ఏం మాట్లాడుతుంది నన్ను చంపి తినబోతుందా? అని సింహం తనలో తాను అనుకుంటుంది. అప్పుడు ఎద్దు ఇంక కొంత గాంభీర్యంగా వింటునావ్ గా సింహం చాలా దగ్గరగా వచ్చేసింది నేను మొన్న క్రుర సింహాన్ని ఆ మహిమలతో ఎలా చంపానో ఈ సింహాన్ని కూడా అలాగే చంపేస్తాను అంటుంది. ఏమిటి ఎద్దు ఇలా మాట్లాడుతుంది. ఈ ఎద్దు నా కన్నా బలమైనదేమో, చాలా మహిమలు వస్తాయేమో ఇప్పుడది నన్ను చంపేస్తుందేమో అని భయం తో సింహం అక్కడి నుండి పారిపోతుంది. మార్గం మధ్యలో నక్కను చేరుకుంది. అప్పుడు నక్క సింహంతో సంభాషణ ఇలా మొదలవుతుంది

**నక్క :** ''రాజా నువ్వు ఎక్కడి నుండి వస్తున్నావ్ పర్వతం లాంటి నువ్వు ఎవరిని చూసి ఇంతగా భయపడి రొప్పు తున్నావ్'' అని అడిగింది నక్క.

**సింహం :** అప్పుడు సింహం అంటుంది ఓసి! నక్క నీ నోటిని అదుపులో ఉంచుకో లేదంటే ఇక్కడే నిన్ను చంపేస్తాను. ఆ సరస్సు ఆవల ఉన్న ఒక భయంకర మృగాన్ని చూసి భయపడ్డాను కానీ అంత మాత్రం చేత నిన్ను చూసి భయపడ్డాను అనుకుంటున్నావా అని సింహం నక్కని కోపగించుకుంది. అప్పుడు నక్క సింహాన్ని ఇలా అంటుంది.

**నక్క :** భయంకరమైన మృగమా ఏం ఆ భయంకరమైన మృగం నాకు అర్థం అయింది అని అంటూ, నక్క హేళనగా నవ్వుతుంది.

**సింహం :** ఎందుకు అలా నవ్వుతున్నావ్

**నక్క :** ఓ పిచ్చి రాజా ! నీ తెలివి తక్కవ తనానికి నవ్వుతున్నాను నీవు దేనినైతే చూసి భయపడుతూ పారిపోతున్నావో అది ఏంటో కాదు ఎద్దు మాత్రమే నీవు నిత్యం భుజించే ఓ మామూలు ఎద్దు.

**సింహం :** నేను నమ్మలేను.

**నక్క :** నమ్మక పోతే నా వెంట రా ! అసలు సంగతి నేను చూపెడతాను.

**సింహం :** లేదు లేదు నేను అక్కడికి మాత్రం రాలేను.

**నక్క :** అయితే మహారాజా నువ్వు ఎందుకో బాగా భయపడినట్టున్నావు. నా తోక నీ తోకను ముడివేసుకుని వెళ్దాం నేను ముందు నడుస్తా ను నువ్వు నా వెనకాల రా. నీవు ఏమి భయపడ వద్దు ఒక వేళ ఆ జంతువు దాడి చేస్తే

ముందుండి నేను ఎదుర్కొంటాను. సరేనా అని అంది నక్క.

**సింహం** : అయితే సరే వెళ్దాం పదా దాని సంగతి చూద్దాం అని అంటుంది. నక్క సింహం ఇద్దరు కలిసి ఎద్దు ఉన్న చోటికి వెళ్తారు.

**ఎద్దు** : (తన మనసులో) ఈ సింహం మళ్ళీ వచ్చిందే. దానికి తోడు జిత్తుల మారి నక్క కూడా ఉన్నట్టుందే, జిత్తుల మారి నక్కను చూస్తుంటే నక్కనే సింహాన్ని నాపైకి ఉసి గొలిపినట్టుంది అని ఎద్దు తన మనస్సులో అనుకుని ఇలా అంటుంది.

**ఎద్దు** : ఓ జిత్తుల మారి గుంట నక్క నేను రెండు సింహాలను తీసుకురమ్మంటే ఒక్క సింహాన్నే తీసుకొచ్చావే... అని అంటుంది.

**సింహం:** ఆశ్చర్యంతో నక్క వైపు చూసి నన్ను చంపాలని కుట్రపన్నావా అని ఆక్రోశిస్తుంది.

**నక్క** : లేదు లేదు రాజా మీరు ఎద్దు మాటలు నమ్మకండి తనను మీ నుండి రక్షించుకోవ దానికి అలా అంటుంది

**ఎద్దు** : ఓయ్ ! జిత్తుల మారి నక్క ఈ బక్క చిక్కిన ఒక్క సింహాన్ని నేను ఏం చేసుకోను నేను తినాలా, నా పిల్లలు తినాలా! నా భార్య తినాలా అని తెలివిగా మాట్లాడుతుంది.

**సింహం** : ఒసేయ్ ! జిత్తుల మారి నక్క నీ సంగతి తర్వాత చెప్తాను ముందు ఇక్కడి నుండి పారిపోదాం రా....!

**నక్క** : ఓ మహారాజా! ఆగండి ఆగండీ దయచేసి నా మాట వినండి వెళ్ళొద్దు ఎద్దు మాటలు నమ్మొద్దు అని అక్కడి నుండి పరిగెత్తాయి.

**ఎద్దు** : అలా ఎద్దు తన తెలివితో సింహం నుండి తన ప్రాణాలను కాపాడుకుంది.

(భుజ బలం ముఖ్యం కాదు బుద్ధి బలం ముఖ్యం అని ఈ కథ ద్వార అర్థం అవుతుంది.)

## విద్యార్థులు గీసిన చిత్ర కళా రూపాలు






ఈ చిత్రం గీసిన వారు

యం. శృతి. బియస్సీ ( యం.ఎస్.సి.ఎస్)

ద్వితీయ సంవత్సరం




ఈ చిత్రం గీసిన వారు

కె. నందిని, బియస్సీ, (యం.ఎస్.సి.ఎస్)

ద్వితీయ సంవత్సరం

ఈ చిత్రం గీసిన వారు
ఎస్. భువనేశ్వరి, బియస్సీ, (యం.ఎస్.సి,ఎస్)
ద్వితీయ సంవత్సరం

ఈ చిత్రం గీసిన వారు
పి.మనీష, బి.యస్సీ (యం.ఎస్.సి.ఎస్)
ద్వితీయ సంవత్సరం

కొందరకు తెనుగు గుణమగు
కొందరకు సంస్కృతమ్ము గుణమగు రెండుం
కొందరకు గుణములగు నే
నందర మెప్పింతు కృతుల నాయాయెడలన్

- పోతన